

# భద్రాద్రిరామచంద్ర శతకము



కర్త:

బల్లె రామచంద్రరాజకవి

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

శ్రీ

# భద్రాద్రిరామచంద్రశతకము


బళ్ల రామచంద్రరాజకవి

ప్రణీతము.



మొదటికూర్పు 2000.

కాకినాడ:

శ్రీ పతి ముద్రణాలయమున

ముద్రితము.

1937.




[మూల్యము రు 0-4-0 లు.

# పీఠిక.

నే నింతకు మును పాంధ్రగీర్వాణములు యథోచితముగ నభ్యసించి, దేశకాలపాత్రముల ననుసరించి నౌకరీ జీవనము చేయువాఁడనై కొంతకాలము ప్రాథమికోన్నత పాఠశాలలలో సంస్కృతపండితునిగను, తెల్గుపండితునిగను బనిచేసి లోకలు బోర్డులలో నధికారి ప్రాపకమునకై పద్యములు చెప్పి చెప్పి, విసువుఁజెంది తుదకుఁ బ్రాచీనకవుల యాశయములఁ బరిగణించి నాయిష్టదేవతయు, నిహపరసౌఖ్యప్రదాతయు నగు శ్రీ భద్రాద్రిరామచంద్రుని సంబోధించుచు, నూటపదియాఱు పద్యములు లోకస్వభావమెఱింగి, నీతి భక్తియుతముగ వ్రాసి కృతిసమర్పణ చేసితిని.

ఈభద్రాద్రిరామచంద్రశతకమం దేవేని దోషములున్నఁ బాఠకమహాశయులు మన్నింతురు గాక !

నా శతకమును విని ప్రోత్సహించుచు నభిప్రాయముల నొసంగిన నామిత్రులకును, ముద్రించుటకుఁ దగిన ధనసాహాయ్య మొనర్చిన కవితాభిమానులకును సదా కృతజ్ఞతాపూర్వకాభి వందనము లర్పించుచున్నాను.

వేళంగి, 1—8—37.

ఇట్లు,
బల్ల రామచంద్రరాజు.

# కవితాభిమానులు

అమలాపురం తాలూకా.

మ. రా. రా. శ్రీ

సలాది బుచ్చయ్యగారు గ్రామమునసబు,
సోమదేవరపాలెం రు 16

ఆకాశం కొండలరావుగారు, జమీందారు, కందికుప్ప 5

సూకల సత్యనారాయణమూర్తిగారు, జిల్లాబోర్డు
మెంబరు, కందికుప్ప 5

ఏడిద వేంకన్నగారు ,, 5

ఏడిద సూరయ్యగారు, గ్రామమునసబు ,, 5

తాడి తిరుపతయ్యగారు, దొంతుకుర్రు 5

కొప్పుశెట్టి ధనరాజుగారు 5

ర్యాలి స్వామిగారు, ఉప్పూడి 5

గుత్తాల దొరయ్యగారు, కొండుకుదురు 5

బుద్ధరాజు రంగరాజుగారు, గెద్దనపల్లి 5

వెదుళ్ళపల్లి సత్యనారాయణమూర్తిగారు
కొత్తపూరు జగన్నాథపురం 5

గుత్తుల సూర్యనారాయణమూర్తిగారు ,, 5

చిక్కాల జానకిరామయ్యగారు, అయినాపురం 3

రంబాల మూలాస్వామిగారు, ఉప్పూడి 3

పినకా గోవిందరాజుగారు, కందికుప్ప 3

మ. రా. రా. శ్రీ

మంత్రిప్రెగడ మల్లపరాజుగారు, ఉప్పాడి 2

బళ్ళ భాస్కరరావుగారు, కొత్తపూరుజగన్నాథపురం 2

పెనుమెత్స సత్యనారాయణరాజుగారు, పల్లంకుర్తు 2

గోనెమడతల వేంకటరామయ్యగారు,
సోమదేవరపాలెం 2

గుద్దటి వేంకటరత్నంగారు, క్రొమానిపల్లివారు
గేదెలలంక 2

తాడి వీరభద్రయ్యగారు, గ్రామమునసబు,
దొంతుకుర్తు 1

తాడి రామయ్యగారు 1

తాడి నాగభూషణంగారు 1

గోనెమడతల అచ్చయ్యగారు, కందికుప్ప 1

తాడి నారాయణమూర్తిగారు, „ 1

పాయసం గురవారావుగారు, పల్లంకుర్తు 1

అద్దేపల్లి విశ్వనాథంగారు, „ 1

కసిరెడ్డి అయ్యపరాజుగారు, „ 1

యల్లాప్రగడ శ్రీరామచంద్రవేంకటనారాయణగారు,
పల్లంకుర్తు 1

క్రొత్తగుండ సుబ్బారావుగారు, „ 1

తాడాబత్తుల వీరాచార్యులుగారు, „ 1

వరదా జగన్నాథంగారు, „ 1

కొప్పూరు సుబ్బరాజుగారు, గెద్దనపల్లి 1



శ్రీ రా మా.

# భద్రాద్రిరామచంద్రశతకము

(రామచంద్రీయము.)



శ్రీ రామ! జయరామ! శృంగారరామ! స
త్ప్రియనామ! యౌవనవిజితసోమ!
శ్రీజానకీసతీచిత్తాబ్జభృంగ! స
మాశ్రితరక్షాచణాంతరంగ!
శంఖచక్రగదాసిశార్ఙ్గసంయుతహస్త!
శతకోటిభానుతేజఃప్రశస్త!
దానవారి! నృపాలమానసంరక్షణ!
కరిరాజపోషణ! కలుషహరణ!

తే. గీ. దివిజగంగాసముద్భవోద్దీప్తచరణ!
పక్షిరాజతురంగ! విపక్షభంగ!
భద్రహృదయాబ్జపూష! సద్భక్తపోష!
రమ్యగుణసాంద్ర! భద్రాద్రిరామచంద్ర! 1

సీ. వాగ్భూషణము లేనివానికి నిలువెల్ల
సొమ్ము లుండిన సోయగమ్ము కలదె?
వితరణంబే లేనివిత్తం బ దెంతయు
న్నను లోకమునఁ బ్రయోజనము కలదె?
ప్రతిపదంబును రసాస్పదము కాకుండినఁ
గవనమ్ము వినఁగ నుత్సవము కలదె?
ఆజన్మభూతదయాశూన్యమతికి నెం
తటిచదు వున్న సార్థకత కలదె?
గీ. ప్రకృతికాంతావిలాససంభరిత మగుప్ర
పంచకపుమాయలోఁబడి పల్లటిల్లి
భక్తితో నిన్నుఁ గొలువక ముక్తి కలదె?, రమ్య...2

సీ. విద్వాంసునకు లేవు వింత దేశంబులు
పరమార్థమున లేదు బాంధవంబు
కవి యెఱుంగని సృష్టికలన యెచ్చట లేదు
చవిలేనికూర వాచవినిఁ బడదు
పండుగు పేరిటఁ బరమాన్నములు లేవు
తిండిపోతుకు లేదు దండితనము
ఎండమావుల నుండ దేమాత్ర ముదకము
కులట లెవ్వరికి సంకోచపడరు
గీ. ఊరిలోవారి కుండదు వారిభయము
బాటసారి కుండదు వల్లకాటిభయము
[illegible] లేదు కాలునిపాశభయము; రమ్య... 3

సీ. అగ్రహారము లీయ నాస్థ యెవ్వరి కుండెఁ?
బన్నులు కట్టించుప్రభులెకాని;
వార్షికముల నిచ్చువాసి యెవ్వరి కుండెఁ?
గవుల బాధించుభూధవులెకాని;
యీనాము లిచ్చెడునీవి యెవ్వరి కుండెఁ?
హితుల వంచించుభూపతులెకాని;
పండితాదరణవైభవము లెవ్వరి కుండెఁ?
దుర్మంత్రులఁ బెంచుదొరలెకాని;
గీ. శ్రితుల కుపకృతు లొనరించుక్షితిపు లెవరు?
తినెడుకూడును బోఁగొట్టుఘనులెకాని,
యిట్టిప్రభువులా కవులఁ జేపట్టువారు?, రమ్య... 4

సీ. కలవానిచెంతను గాఁపురం బుండినఁ
గష్టసుఖమ్ములు గాథ మగును
ఒడ లెఱుంగనిరాజుకడ నున్నభృత్యులు
మానాపమానముల్ పూనవలయు
జూదరిస్నేహమ్ము నాదరించినపట్లఁ
దుదకు నష్టములతోఁ దూలిపోవు
నానులయిండ్లె యాస్థానమ్ములైయున్న
భోగులు జోగులై పోవుచుంద్రు
గీ. మనుజు లెల్లప్పుడును ధనమదముచేత
మాసిపోవరె? బుద్ధులు మాఱిపోయి;
యెఱిఁగి తిరిగినవారికె పరువుగలదు; రమ్య... 5

సీ. పెద్దవారింటను బెత్తనదారైన
    సౌదార్య మబ్బునే? యల్పునకును;
సామ్మిచ్చి లంజలచుట్ట మైనంతనే
    రారాజె కానిమ్ము రసికుఁ డగునె?
పదిమందిలో మంచివానిని బడఁదిట్ట
    నె ద్దగునేకాని పెద్ద యగునె?
వేషభాషలమాత్ర వేదాంతి తా నౌనె?
    పరతత్త్వ మెఱుఁగనిపరమశుంఠ;
తే. గీ. శ్రీమదభిరామతారకనామరహిత
    కావ్యపాఠము బుధజనశ్రావ్య మగునె?
    చెవుల గీపెట్టుఝిల్లికారవమె కాని; రమ్య... 6

సీ. పురుషాయితము చేయఁ బూఁబోఁడికా? సిగ్గు;
    వెలయాలికా? రాజవీథిభయము;
పచ్చిమాంసంబు సాపడువానికా? దయ;
    తాఁగకా? యల్లునిరాజసంబు;
పరు వెఱుఁగనియూరఁబందికా? యంబారి;
    మంత్రికా? చెప్పుట తంత్రమహిమ;
రస మెఱుంగనిపసరమునకా? కవనంబు;
    ముదికొండముచ్చుకా? ముద్దుగుమ్మ;
తే. గీ. మాటవాసి యెఱుంగక కాటులాడు
    మోటుమానిసికా? హాస్యములపసందు;
    నరపిశాచికా? నీదివ్యచరణభక్తి; రమ్య... 7

సీ. కామాతురుఁడు నావి కనిపెట్టి పొందునే?
లంచగాఁ డెంచునే మంచితనము?
లంజ మగం డెంతలాలింప మెచ్చునే?
వెలయాలి నమ్మునే విటులబాస?
లర్థాతురుఁడు చుట్టమన్న డబ్బిచ్చునే?
త్రాగి జమీ నిడఁ ద్యాగిసానె?
గయ్యాళి తనపతిగౌరవం బెంచునే?
జ్ఞాని మోహాబ్ధిలో జాఱిపడునె?
తే. గీ. స్వసుఖమే కోరుకొనునట్టిస్వామి యెపుడు
నాలకించునె? ప్రజలగగ్గోలు; నకట!
యిట్టినారికి గతు లేమిపెట్టినావో?, రమ్య... 8

సీ. అప్పుఁజేసుక తిన్నపప్పుఁగూ డొకబెంగ
పరులకల్మి కసూయపడిన బెంగ
అన్నదమ్ములయాస్తు లపహరించిన బెంగ
పెండ్లము విడనాడఁ బెద్దబెంగ
అన్యాయ మొనరింప నంతకంటెనుబెంగ
వర్ణసంకర మైనపట్ల బెంగ
కూఁతురు చెడుఁ గైన మాతకుఁ గడుబెంగ
కొడుకు దుండగుఁ డైన గొప్పబెంగ
తే. గీ. ఇట్టిసంసారపుంబెంగ లెన్నో పెట్టి
కట్టికుడుపుచు నుంటివి కర్మము లని
మాకు నినుఁ జేరుకొన నింక మార్గ మేది?, రమ్య...

సీ. కులకాంత సతత మాకులతఁ జెందించిన
నింద్రవైభవ మున్న నేమిశోభ
కన్నకుమారు నాపన్నుఁ జేసినపట్లఁ
దనమంచి కిఁక నేమిఘనత వచ్చుఁ
దనసేవకులఁ బట్టి తహతహలాడింప
నధికారమున కేమి యంద మబ్బు
నర్థి కేమీయక యల్లరి పెట్టినఁ
బరమార్థమున కేమి పాలుగూడు
గీ. వేలు లక్షలకొలఁదిని జాలినంత
ద్రవ్య మార్జించి తుదకు నధర్మమూని
సంచరించెడివారి కేసంచితమ్మొ ? రమ్య... 10

సీ. హెచ్చుపన్నులు గట్టఁ బెచ్చుపెర్గినగా
ర్మొంటును మే మేమి గెంటఁగలము ?
అభిమానులకు నిచ్చు నధికార్లు గలుగ లో
కలుబోర్డు నే మేమి కట్టఁగలము ?
కలవార లగుచుఁ బేదలకుఁ జో టీయని
ధనికుల నే మేమి చెనకఁగలము ?
జారతాచోరతాచారపారీణుల
కెంతబోధించి వారింపఁగలము ?
తే. గీ. అన్నిటికి నీవ కలవు నే నెన్నిసార్లు
మొఱ్ఱపెట్టిన ఫల మేమి మూఢలోక
మెంచదే వచ్చి పైఁబడు మంచిమాట, రమ్య... 11

సీ. పిల్లకాసుకు గొట్టి కల్లలాడించెడి
యధికార్ల కేముందు నంత్యదశకు ?
కూటసాక్ష్యము లిచ్చి కొంపలఁగూల్చెడి
గడుసుకు పరలోకగతులు కలవె ?
వడ్డికి వడ్డీలు సడ్డింపు లేకుండఁ
గట్టువారికి ముక్తి గలదె భువిని ?
అప్పుఁ గైకొని పోయి ముప్పుత్రిప్పులఁ బెట్టు
చెడు గిహాపరములఁ జెందఁగలఁడె ?

తే. గీ. వీరికర్మానుసార మాతీరు చేసి
పాతకము గూర్పనో యుపఖ్యాతిగొంటొ
ఎఱుఁగలే మిఁక నీబుద్ధి కెఱుకగాదె, రమ్య... 12

సీ. బదులిచ్చి కొనితెచ్చు బంధువిరోధమ్ము
చనవిచ్చి గైకొన్న చౌకతనము
ఉపకారమున కేగి యురిలోఁ దగుల్కొంట
మనసిచ్చి వీథిలో మాటఁబడుట
ఇలువీడి పొరుగింట నెలవు చేకొనియుంట
ఆడితప్పినవారి నంటియుంట
చంచలాత్ముల నమ్మి వంచనపాలౌట
కూటికై నీచులఁగూడఁ జనుట

తే. గీ. నాకె కా దిఁక జన్మజన్మములకైన
నక్కటా ! యివి పగవారికైన వలదు
బుద్ధిమంతుల కే నేమి బోధసేతు ?, రమ్య... 12

సీ. భోగలాలసునకు రోగభయం బెచ్చు
రోగి కోరికల నుట్టూతలూఁగు
చాగి కీయను డబ్బు సర్దుబా టుండను
శ్రీమంతుఁ డిడుటకుఁ జేయిరాదు
సిరిగలానికి లేక చిత్తశాంతి రవంత
కూలివానికిఁ గోర్కె చాలహెచ్చు
పేదవానిగృహంబు పిల్లలతో నిండుఁ
గలవాని కొకఁడైనఁ గలుగకుండు
తే. గీ. తగినసతి యున్న నీడైనమగఁడు లేఁడు
ప్రథితకవి యున్న రసికుఁడౌ ప్రభుఁడు లేఁడు
ఏమొ నీసృష్టివైచిత్ర్య మెఱుఁగఁబోను, రమ్య... 14

సీ. ప్రజ కసమ్మతమగు పరిపాలనంబును
దుర్మంత్రి గలవారి దొరతనంబు
పదవికై పరుల నాపదలపా ల్జేయుట
ఇంటగు ట్టిచ్చెడి తుంటరియును
వేదాను లెఱుఁగని విప్రు లాధిక్యంబు
అహమును విడనట్టి యణఁకువయును
జాగా మెఱుంగని వాగుడితనమును
పూఁటకూళ్లమ్మల పుణ్యగరిమ
తే. గీ. ఎవరు మెత్తురు లోకము కేమిహితవు ?
చెడ్డపే రేదొ తనపయిఁ బడ్డఁ బోవఁ
దానె గాదు పితామహుఁ దరమె యగునె ?, రమ్య...

సీ. విద్వాంసునకు నేల వేషభాషల కొండు
పరమమిత్రున కేల బాంధవంబు
అర్థాతురున కేల యందచందంబులు
కాటికాపరికి శృంగార మేల
పలికి బొంకినవారి భాగ్యమ్ము లవియేల
పాపికి సంసారభయ మదేల
చెనటికిఁ బరనింద చే టేమి తెచ్చు ని
రక్షరకుక్షికి రాజ్య మేల
తే. గీ. వినయ మెఱుఁగనివానికి మనవి యేల
కవిత యెఱుఁగనివానికిఁ గావ్య మేల
అర్థి కన్నంబు బెట్టనియాస్తు లేల ?. రమ్య... 16

సీ. కలవాఁడె నైనచోఁ గడనున్నఁ గందురు
తప్పు చేసిన వాని నొప్పుకొంద్రు
భాగ్యవంతుఁడు తిట్టి బాధపెట్టినపట్ల
మందలిం పని మోద మందుచుంద్రు
ధనికుఁడు ప్రాల్మాలి ఖనకుఁ డైననుగాని
సామర్థ్య మని వాని సన్నుతింత్రు
శ్రీలుగలాడు కూనీలు చేసినఁగాని
పాలియించె ఖలు నని పొగడుచుంద్రు
తే. గీ. కలిమి పేరెత్తఁ దలదూర్చుఁ గలియుగంబు
మంచిచెడ్డలు యోచించుమనుజు లెవరు ?
ఎంత గ్రుడ్డిగ జగము సృష్టించి తయ్య !, రమ్య... 17

సీ. మాతృభాషలకు సన్మానంబు కొఱతయ్యెఁ
పరభాషలకుఁ జాల బరువు హెచ్చె
సంసారు లన్నిట సానులుగా నైరి
సాను లన్నిటను సంసారు లైరి
వర్ణాశ్రమాచారవాసన లడుగంటె
మెట్టవేదాంతమే పట్టుఁబడియె
పల్లెలన్నియుఁ బూఁటకూళ్లకు నెల వయ్యె
నన్నసత్రము లన్ని యంతరించెఁ
తే. గీ. జదువుసాము లిఁకేలని వదలి జార
చోరు లయి కాలమున్ బుచ్చుచూరు లైరి
ప్రబలెఁ బాశ్చాత్యపద్ధతుల్ ప్రాభవముగ. రమ్య...

సీ. దాత దరిద్రుఁడే; ధనవంతుఁడా? లోభి
న్యాయాధికారి యన్యాయకారి
అగ్రకులంబులా? యడుగంటె మొదటికి
నీచజాతులు పైకి నిలువఁ జూచె
నల్పవిద్వాంసున కధిక మగా గర్వమే
గుణవంతునకుఁ గూడు కొఱత వచ్చు
గుణహీనునకు డబ్బు కుప్పలు కుప్పలే
కడుపేదవాని కాఁకలియు హెచ్చు
తే. గీ. రంభ వండున కగును బల్ తాఁగ యుత్త
మోత్తమునకును భార్య యగా నుర్వియందు
నేమొ నీసృష్టివైచిత్ర్య మెఱుకపడదు, రమ్య... 19

సీ. తినఁబోవువయసులోఁ గొన డబ్బు లేకుండు
డబ్బుండి తినఁ గడు పుబ్బుచుండుఁ
దనప్రాయమున విత్తమున లెక్క పెట్టఁడు
ముదిమిలో గవ్వైన వదలఁబోఁడు
పండకుండినచేను ఫల మియ్యఁ డెవ్వఁడు
పండఁ బన్ననివచ్చు ప్రముఖుఁ డుండు
మానధనమ్మున కూనువానికి నేదొ
సంసారలోపమే సంభవించుఁ
తే. గీ. కటకటా! యివి నీచేతఁ గలుగుపనులొ
కాక వారిపురాకృతకర్మఫలమొ
యెంచ శక్యము కాదు బాధించ కయ్య!, రమ్య...20

సీ. కలిమి యించుకకల్గఁ గలవారలం దెల్ల
మొనగాఁడ నని యెంచుమనుజుఁ డొకఁడు
బంట్రౌతుపని సేయువాఁ డయ్యు మదిని దా
నిని మోక్ష మనుకొనుమనుజుఁ డొకఁడు
ఓనమాలును వచ్చిరాని సాహితితోడఁ
దనపాండితికి నిక్కుమనుజుఁ డొకఁడు
తనధర్మమును మానుకొనికూడఁ దనజాతి
ఘనతకై యుప్పొంగుమనుజుఁ డొకఁడు
తే. గీ. ఇట్టు లున్నార లిది మౌఢ్యమే కదయ్య!
అసలు ధనమును బదవి విద్యయును జాతి
ఘనములే? పూజ్య మైనది గొనమె కాని, రమ్య... 21

సీ. కోపము వారించుకొనువాఁడె గురుమూర్తి
పాడిఁ దప్పనివాఁడె పండితుండు
ప్రియుని దా మనసారఁ బ్రేమించునదె భార్య
లంచ మడ్గనివాఁడె సంచితార్థి
పలువురు తల లూఁపఁ బాడినదే పాట
వ్యాధిని గనిపెట్టువాఁడె వెజ్జ
కన సర్వజనవశ్యమును జేయునదె విద్య
యభయప్రదానమే యధికశక్తి
తే. గీ. రసికు నంకాన దీపించురమణివలె ని
రక్షరునిగూడ వలపించునదియె కవిత
యాపదకు నడ్డుపడువాఁడె యాప్తుఁ డెపుడు, రమ్య...

సీ. పార్టిభేదము వెట్టి పడఁగొట్టుటే కాని
జాతిభేదం బేమి చావలేదు
స్వార్థంబు విడినార మని చెప్పుటే కాని
పదవులపై నాశ వదలలేదు
పార్టీలు వృద్ధియై పరువెత్తుటే కాని
యుపకార మొనరించు నూహలేదు
వోటు వోటనెడుసాపాటు రాయుళ్లకు
మనవిని వినుటకే మనసులేదు
తే. గీ. ఇట్టి మెంబర్లఁ బ్రెసిడెంట్లఁ బట్టు లరసి
కొలువఁ బండితకవుల కేవిలువ గలదు ?
ఆశయింపఁగ నిడవె ? నీ వభిమతములు, రమ్య... 23

సీ. ఏ మన్నఁ బడినవో నెంతొ సాత్త్వికుఁ డందు
రెదిరింపఁగా వాఁడె యెడ్డెమనిసి
తమ కిచ్చకముగఁ జెప్పిన మంచివాఁ డండ్రు
న్యాయంబు చెప్ప నన్యాయవాది
పద్యము తెలుఁగె త్తిపాడిన భట్టాగ్రు
మాటాడకుండిన మందుఁ డండ్రు
కనిపెట్టిమాట్లాడ గడుసువాఁ డందురు
చన విచ్చినంతనే చవట యందు
తే. గీ. రెవనిసామర్థ్య మెవరికి నెఱుకపడును
బుద్ధిమంతుల కేగాని పుడమియందు
గంగలోఁ తెంచ శక్యమే కొంగలకును ?, రమ్య... 24

సీ. బలియుఁ దా నెంతటితులువరక్కసి యైన
విష్ణు మెప్పింపఁడే వితరణమున
రావణుం డెంతదుర్మార్గుఁ డై యుండినఁ
బాలింపఁడే లంక మే లనఁగ
దుర్యోధనుం డెంతమందగీఁ డైనను
బ్రజల మన్నింపఁడే పాలనమున
నందుఁ డెంతయసూయ నందినవాఁ డైనఁ
బౌరులఁ జూడఁడే గౌరవముగ
తే గీ. వారు వారికిఁ దగినట్టివారితోడ
వైరముఁ బూనిరేకాని వాస్తవముగఁ
బ్రజల బాధించిరే యెట్టిపట్ల నైన, రమ్య... 25

సీ. నాగలోకవిలాసభోగినీమణి యైన
మగని లోఁజేయుట తగవుకాదు
సాటిలేనటువంటికోటీశ్వరుం డైనఁ
బేదల విడనాడఁ బెంపులేదు
పండితమండలాఖండలుం డైనను
మూఢులతో వాద మాడరాదు
భోజునంతటి మహారాజైన "లోకలు
బోర్డు"ల నాసించి పోవరాదు
తే. గీ. వీని గుర్తించుజను లెందు మాననీయు
లగుదు రన సంశయము లేదు; తగవుమాలి
పోవ యత్నింతురా చేటు మూడకున్న ?, రమ్య...26

సీ. యజ్ఞాదికంబుల నాస్థతోఁ జేయంగ
నాస్తికి మునుముందె స్వస్తియయ్యెఁ
దీర్థాలవెంబడిఁ దిరిగి నిన్ దరిసింప
నారోగ్యమూ చాలినంత లేదు
దీనుల రక్షింపఁ బూనుద మనుకొన్నఁ
గడుపాఱ నన్నంబు కానరాదు
పనిఁబూని నీసపర్యను గాల మేఁగింప
నసదృశధైర్యసాహసము లేవి ?
తే. గీ. అనయమున్ బస్తు లేకుండ నాదరించి
తృణమొ కణమొ నీ విడిన ద దెంతో యంతె
దానితో నుంటి నిటుమీఁద దారి నీవె, రమ్య... 27

సీ. వార్ధక్యమూ చెవిఁ బట్టి యూడించఁగాఁ
బడుచుఁబెండ్లా మున్న ఫల మ దేమి?
కాపేయమూ చేయిఁ గట్టివేయుచునుండ
వాకిట నిధి యున్న ఫల మ దేమి?
సంసారమూ కాలిసంకెల యైయుండఁ
బరము పరం బన్న ఫల మ దేమి?
ఉబలాటమూ యుసు రుడుఁగుచో నీఁగికిఁ
బలవరించినయంత ఫల మ దేమి?
తే. గీ. జ్ఞాన మొదవిన దాది నీస్మరణ లేక
మేఁకమెడచన్నువలె నున్నమే న దేల?
నీప్రసాదముఁ గొన్నవానిదె భవమ్ము; రమ్య... 28

సీ. ముఖము చంద్రుఁడె, భృంగములు ముంగురులు, నుగ్గు
బుగ్గలు జగ్గులనిగ్గు లీనుఁ,
జూపులు తూపులు, చూడ ముచ్చట యగు
మోవి తేనియతేట, ముద్దుగారు
వాలింపు గజనిమ్మపండ్లు, చూచుకములు
కాటుకపిట్టలకాంతి మించు,
నారు చీమలబారుతీరుఁ గేరుచునుండుఁ,
గచము నల్లనిత్రాఁచుకరణిఁ దోఁచు
తే. గీ. మొగముసోయగమున కెంతొ మురిసి మురిసి
కుచము లని, కటియు, నా రని, కచము లనుచుఁ
గల్పనలు సేయుకవుల వాగ్గతులు వితలు, రమ్య... 29

సీ. పితృకార్యమునఁ గర్చువెట్టనివాఁ డగ్ర
హారంబుల నొసంగి యేఁపు టెట్లు ?
కూలివానికి కొల్చుఁ గొలువనియాతండు
ధాన్యరాసుల నెట్లు ధారవోయుఁ ?
దనవారినే మెచ్చ ననువాఁడు పరు నల్ప
విషయంబులో నేమి వినుతిసేయుఁ ?
దనతప్పునే బైటఁ దలపెట్టువెంగలి
పరుల దే మని చాటుఁ బలుచుచుండుఁ ?
తే. గీ. కృత మెఱుంగక దారుణగతుల నడచి
మాయలోఁబడి మర్యాద మంటఁ గల్పు
నిట్టివారికి నేగతిఁ బెట్టినావొ ?, రమ్య... 30
సీ. భగవంతునకుఁ బ్రేమ భక్తలోకమునందుఁ
దలిదండ్రులకుఁ బ్రేమ తనయులందు
వెచ్చకానికి లంజయిచ్చుకమ్ములఁ బ్రేమ
వెలయాలికిం బ్రేమ విత్తమందుఁ
గ్రొత్తకోడలి కింటిపెత్తనమ్మునఁ బ్రేమ
నటకులకుం బ్రేమ నాట్యమందుఁ
జిఱుతపిల్లల కెల్లఁ జిఱుతిండిపైఁ బ్రేమ
సుకవులకుం బ్రేమ సూక్తులందు
తే. గీ. సరసులకుఁ బ్రేమ రసికప్రసంగమందుఁ
జదువరికిఁ బ్రేమ పుస్తకసమితియందుఁ
బిసినిగొట్టుకు ధనమందె ప్రేమ మెండు, రమ్య... 31

సీ. కార్యవాదులపట్లఁ గయ్యంబు కూడదు
దుర్మార్గుఁ డేమన్న దుడుకు వలదు
కవులతో నెన్నఁడుఁ గలహంబు పడరాదు
భిక్షుకు నల్లరి వెట్టఁ దగదు
కొండెగాండ్రను జేర్చుకొన హాని తప్పదు
లేని దారోపింపఁ బూనరాదు
పరకాంతఁ గలనైన భావింప నొప్పదు
వంటలవానితో వాదు వలదు
తే. గీ. తాహతును మీఱునట్టియత్నంబు తగదు
నీతిమార్గమ్ముఁ దప్పుట ఖ్యాతిగాదు
శరణు వొచ్చినఁ బ్రోచుటే పరమపథము, రమ్య...

సీ. అతిరాగ మెచటనో హానియు నచటనే
సుజనుఁ డెచ్చటనో దుర్జనుఁ డచటనె
భోగమ్ము లెచటనో రోగమ్ము లచటనే
గుణ మెచ్చటనో యవగుణ మచటనె
ఆస్తిక్య మెచటనో నాస్తిక్య మచటనే
క్రొత్తావి యెచటనో క్రుళ్ళచటనె
మునివృత్తి యెచటనో మూర్ఖత యచటనే
భాగ్య మెచ్చటనో లేవడి యచటనె
తే. గీ. ఒకటొకటి కవినాభావ మొప్ప మమ్ము
దింపి సంసార మనుపాడురొంపియందుఁ
ద్రిప్పుచున్నాఁడ వాశల కప్పగించి, రమ్య... 33

సీ. ఖరము సింగముతోలుఁ గప్పుకొన్ననుగాని
గర్జించునే? కూయుఁగాక యెపుడు
అంకులాడిని భర్త లాలించిననుగాని
విటునివంకను గన్ను మిటకరించుఁ
గఱకుఁగసాయికి నఱచి చెప్పినఁగాని
మానునే? పశుహత్యఁ బూనుఁగాని
కుక్క నందలమునఁ గూర్చుండఁబెట్టిన
మఱచునే? చెప్పుల కుఱుకుఁగాని
తే. గీ. యిట్టి వెడబుద్ధు లుండిన సెట్టివార
లార్చితీర్చుదు రయ్య? నీ యాజ్ఞ చేత
వార లంతట వారలే తీరవలయు, రమ్య... 34

సీ. ఈశ్వరాంశము లేక యైశ్వర్యవంతుఁడే?
విష్ణ్వంశ లేకుండ విభుఁడు కాఁడు;
కిన్నరాంశంబు లేకున్న గాయకుఁ డౌనె?
శుక్రాంశ లేకుండ సుకవి కాఁడు;
భోగ్యంశ లేకున్న భోగవంతుం డౌనె?
గుర్వంశ లేకుండ గురుఁడు కాఁడు;
బ్రహ్మాంశ లేకున్న బ్రహ్మవిదుం డౌనె?
రవ్యంశ లేక విక్రముఁడు కాఁడు;
తే. గీ. అప్సరోంశయు లేక నాట్యంబు రాదు;
పెట్టిపుట్టకపోయినఁ బట్టదు సిరి;
భక్తి కలవాఁడు కాకున్న ముక్తి లేదు, రమ్య... 35

సీ. వలపింపనేరని వనితయందం బేల?
కూడనికార్యంబుఁ గోర నేల?
సరసాన్నములులేని సంతర్పణం బేల?
కవిలేని సభలవైభవము లేల?
పెట్టిపోయనిదొర వెట్టిచాకిరి యేల?
యెపుడో వీడినపతి కేడ్వ నేల?
అప్పుతోడుతఁ గల్మి నంది యుబ్బుట యేల?
యౌచిత్య మెఱుఁగనిత్యాగ మేల?
తే. గీ. సార్థకతలేని వెల్ల నిరర్థకములు;
తోఁచ కావేదజుఁడు డిట్టితుచ్ఛసృష్టిఁ
బెంపుగాఁ జేయు నిఁక నందలింప వేల?, రమ్య... 36

సీ. వాణిజ్యమున లక్ష్మి వఱలుచుండు నటంచు
మించి శాస్త్రమ్ము వచించుఁగాదె
యందులో సగ మర్థ మందరే కర్షకుల్?
వ్యవసాయ మొనరించి పాటుపడిన;
దానిలో సగము సేవానిష్ఠ రాజుల
కడ నుండువారికిఁ గలుగుచుండుఁ;
బై ముప్వురికె పట్టుపడులక్ష్మి భిక్షాట
నమ్ములో లేదు లవమ్ముఁగూడఁ
తే. గీ. గాన నీదురవస్థ నక బూనకుండ
బ్రతుకుఁదెఱవున కేదో సద్గతి నొసంగి
కూర్మితో నీపదాబ్జముల్ గొలువనిమ్ము, రమ్య... 37

సీ. తనవారికే కీడుఁ దలఁచుచుండెడువాఁడు
      సైఁచునే పరవారి సంతసంబు
గంగిగోవును బట్టి ఘాతచేసెడువాఁడు
      పలికిబొంకుట కేమిభయముపడును
దనతల్లిపట్లనే తప్పొనర్చెడువాఁడు
      పరకాంత నేమని పట్టఁబోఁడు
ఆపదలో నిడ్డయప్పు తీర్చనివాఁడు
      పిలిచి యెవ్వరికిఁ గాసుల నొసంగుఁ
తే. గీ. జుట్టముల కేదొ యపకృతిఁ జూచువాఁడు
      పరుల కేమని చేయఁడు పాపపుఁబని?
      నిట్టివారల కేగతిఁ పట్టఁగలదొ!, రమ్య... 38

సీ. ముడిగాళ్లు పడినచో ముదిత యిల్లాలగుఁ
      గలిమి నశింప జాగ్రత్తపుట్టుఁ
గామేచ్ఛ లడుగంటఁ గడకు బైరాగి యౌఁ
      బరపతి పోయిన నిరసన మగు
నతివ లెవ్వరు రామి ననుకూలుఁ డైయుండు
      రిక్తుఁ డౌనెడ దేశభక్తుఁ డగును
అప్పు పుట్టనినాఁడు గొప్ప లక్కఱలేదు
      ఆపదలో మ్రొక్కు లధిక మగును
తే. గీ. దేహదార్ఢ్యము గలనాఁడె తెలివిఁజెంది
      యతురం బైన నీపద మందుకొనకుఁ
      బాటుపడ రేమిపాపమో నేఁటిప్రజలు, రమ్య... 39

సీ. నిజ మాడ నెవరికి నిష్ఠురమే వచ్చు
మొగమిచ్చకము లాడ ముచ్చట యగు
నైనదానికి నెంతో యారాటపడుదురు
కాఁబోవుదానిని గాన రెవరు
చూచి మాడనిపని పేచీని బుట్టించుఁ
బ్రత్యక్ష మగుదానిఁ బట్టఁబోరు
కాంక్షించువస్తువు కనఁబడ దెప్పుడు
నుపయోగపడనిది యుండు నెదుటఁ
తే. గీ. దగువివేకంబు లేకున్న నగును నెల్ల
పనులయం దిట్టి తత్తఱపా టదెంత
పండితుల కైన నొక్కొక్కపట్టునందు, రమ్య... 40

సీ. పదములు పాటించి కుదు రైననడకతో
నూతనఫక్కిని నూలుకొల్పి
రసముఁ బూరించి సాతసము పెంపెసలార
భావముల్ విరియంగఁ బాఱఁజేసి
వలపించి రీతులు మొలపించివృత్తులు
పచరించు మఱుఁగులు పట్టువఱచి
పుణ్యపాపములు, నగణ్య మా నీతులు
మరులు పుట్టించి సంబరము నిచ్చి
తే. గీ. కవిత యొప్పినఁ గనఁబోరె కలియుగాన
సరసుల మటంచుఁ దెగనీల్గసాగుచుంద్రు
ప్రభువులో కాక వీరలు పశువులొక్కొ?, రమ్య...41

సీ. కనపడ్డకాంతను గౌఁగిలించిననాఁడె
పురుషకారం బని పొంగిపోతి
సాధునైననుగాని బాధ పెట్టిననాఁడె
పే రుండు నని పెచ్చుపెరిఁగినాను
నిరపరాధులనైన నిరసింపకుండిన
నధికారమా యని విధముచెడితిఁ
గడుపు నిండినమాత్రఁ గైలాస మనుచు ను
రాగతమ్ములు సేయసాగినాను
తే. గీ. ఏమిశిక్ష విధింతువో యెఱుఁగఁ జాల
నెంతపరితాపపడిన నిం కేమిఫలము
నీకృపారస మిచ్చి మన్నింపుమయ్య !, రమ్య... 42

సీ. మాలమాదిగలెల్ల మననా రనుటెగాని
పరమార్థ మూహించి జరుపలేరు
దారపుత్రాదులు వైరు లంటయెగాని
వారికై శ్రమపడ భార మనరు
పూర్వశాస్త్రంబులఁ బ్రువ్వదిట్టుటెగాని
వానిప్రామాణ్యంబు మానలేరు
మతములన్నిటి కొక్కగతి యనుటేగాని
పనివచ్చినపుడు వే ఱనుట పోదు
తే. గీ. సహజముగ నాత్మలో నెట్టిసంశయంబు
లిమిడియున్నను లోకుల కిచ్చకముగ
నాడుదురు పండితులుగూడ నధమరీతి, రమ్య... 43

సీ. పడఁతికిఁ బరబుద్ధి పొడమఁగూడదుగాని
పొడమ నిరోధించు పురుషుఁ డెవఁడు
దానశీలునియొద్ద ధన ముండవలెఁగాని
వల దని వారించువాఁ డెవండు
మొండెవానికి మంచి యుండఁగావలెఁగాని
చెప్పి చేయించు నెచ్చెలి యెవండు
రాగాంధునకును వైరాగ్యంబు గలుగదు
కలిగినఁ దప్పించు బలియుఁ డెవఁడు
తే. గీ. సహజసద్గుణసంపద జరగువాని
కడ్డు బెడ్డను గలదె? యొండైనఁగాని
యింతకుఁ ద్వదాజ్ఞ దాఁటంగ నెవనివశము?, రమ్య...

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లియాడినసతిఁ బాసి
పరకాంతపదములు పట్టినట్లు
తనసేమముం గోరుఘనులను నిరసించి
పలుగాకులకు మేలు సలిపినట్లు
విమలగంగాప్రవాహమున స్నానము మాని
పల్వలమ్ములఁ గ్రుంకఁ బాటినట్లు
మాతృభాషలకు సన్మానంబు విడనాడి
పెరభాషలను గౌరవించినట్లు
తే. గీ. స్వజనసంఘంబు నెల్ల నావలకు నెట్టి
పరుల మన్నించుచుండుభూపతులు గలుగ
సుఖము మా కెట్టు లబ్బు నీక్షోణియందు?, రమ్య...45

సీ. త్రాగుఁబోతులతోడఁ దగను సావాసంబు
మర్యాద నాసించుమానవులకుఁ
గులవృత్తిఁ బట్టి లోఁకువఁ జేయువారితోఁ
గలియుట జ్ఞానికిఁ గష్టతరము
తనశక్తిఁ బరునిశక్తిని గణింపనివారి
యొండఁ జేరిన ఘను లుండలేరు
మాటపొందిక లేనిమోటుమానిసితోడ
సరసులు మాటాడ విరస మగును
తే. గీ. ఎఱుఁగ కందఱి నొకరీతిఁ గఱకులాడు
నెడ్డెమనుజులు నిరసింప నేమిలోటు ?
మానధనులకు సంతోషహాని గాని; రమ్య... 46

సీ. ఇంపుగా మగని రమింపఁ గల్గినమాత్ర
నిల్లా లగునె ? మంచియుల్ల మేది ?
మెడనిండ దండలు పడవేసినంతనే
గురువరుం డగునె ? సద్గుణము లేవి ?
బూడిద నిలువెల్లఁ బూసినమాత్రాన
బైరాగి యగునె ? ప్రభావ మేది ?
గోటుగాఁ దలను గిరీట మూనినమాత్ర
రాజౌనె ? తగినంతరశ్మి యేది ?
తే. గీ. ఆశ లడుగంటకుండిన యతియు నగునె ?
దోషములు చెప్పినంత నిర్దోషి యగునె ?
యేపగిది నున్న నేమి నీ కెఱుకపడిన, రమ్య... 47

సీ. భార్యయేకద యని బాధించితిని నేర
మున్న లేకున్న మురుకు లాడి
నాకగే యని వెట్టిచాకిరి చేయించి
పరితాపపెట్టితి సరకుఁగొనక
తలిదండ్రులే యని విలువ గణింపక
తూలనాడితి బుద్ధి ప్రాలుమాలి
బుజ్జగించుచు విద్య లొజ్జ చెప్పఁగాని
యపహసించితి మంచి నరయలేక
తే గీ. ఏమిపాపానఁ బోదునో యెఱుఁగఁబోదు
జేసినవి తప్పులే ముందుచే తెఱుఁగక
చెప్పితిని మీఁద నింక నీచిత్త మెట్లో ?, రమ్య... 48

సీ. చల్లగా మాటాడి పిల్లనై తానుగా
విడిపోవఁ డని పల్కువేసు డొకఁడు
చన వీయఁ జంకెక్కుచంటిబి డ్డగునంచుఁ
బొమ్మని చెప్పెడిపురుషుఁ డొకఁడు
కదిపిన వానిని గందిరీఁగలపుట్ట
పలుకరింపకు మనుపలువ యొకఁడు
ఒకమాటు నేర్ప నోపికపట్టి వార్షిక
మడుగుభల్లుక మనువెడఁ గొకండు
తే. గీ. పొట్టకై వేఁగి ప్రజలఁ జేపట్టియుండఁ
బండితులఁ జూచి యిటువంటిబండమాట
లాడుచుండఁగ సుఖము లెవ్వాఁడొసంగు ?, రమ్య...

సీ. ధనవంతుఁ డనుచు సందర్శనంబును జేయ
మొగమెత్తి చూడఁడే మొద్దురీతి
నొకవేళ మాట్లాడ నూహించునా యేదో
మో మోరగాఁ ద్రిప్పి జామున కను
నామాట తనసొత్తు కేమినష్టము లేని
పద్ధతి నైనచోఁ బలుకుచుండుఁ
దనమాట పై పెచ్చు విను మంటయేకాని
చెప్పినమనవిని జెవులఁబెట్టఁ
తే. గీ. డిట్టిలుబ్ధుఁడు మాటలు కట్టి ధనము
తాఁ దినక యొరుల కీయక దాఁచుకొన్నఁ
దుదకు దొంగలకో మఱి దొరల కగునొ?, రమ్య...

సీ. కవనంబు మంచిదే కాఁబోవువాఁడవే
యని మెచ్చుటేకాని మనవి వినరె?
సేవకావృత్తి కాశింప నీ కేలంచు
మాటాడుటేకాని మూట విడరె?
నోరారఁ దీపిగా నుడువుచుండుటెకాని
తగుసాయమును గోర మొగముఁ గనరె?
మన మంత యొకటని మాట యిచ్చుటెకాని
తమజాతి గన్న నుత్తములఁ గనరె
తే. గీ. యిట్టిప్రజ నమ్మి నీభక్తిఁ గట్టిపెట్టి
యైహికముఁ గూడ విడనాడు నధమవృత్తి
నట్టుకును ముక్కుకును జెడునట్లుకాదె?, రమ్య... 51

సీ. చదు వాతఁ డేకాఁడు చదివితి నే నని
వికటంబుగా వాగువెడఁ గొకండు
పని లేనిపని నక్క వినయాలు మన కేల ?
యని యీసడించెడి చెనఁటి యొకఁడు
ధనవంతుఁడను గాద ? మనమాట చెల్లదా ?
యని నోరుజాఱెడి ఘనుఁ డొకండు
వీనియక్కఱ యేమి ? కాని కూడను రాని
పద్యాల కే మను ప్రభు వొకండు
తే. గీ. అడిగికొని మనువారి కీపొఁడుగు లేల ?
యనుచు నిరసించుచుండెడి యధము లుండ
సుఖము మా కెట్టుగల్గు నీక్షోణియందు?, రమ్య...52

సీ. ఎదుటివాఁ డేదైనఁ జనువుచోఁ బ్రశ్నింపఁ
బెద్ద నాదు నటంచు గద్దరించి
తప్పు లేనిదె పట్టి తహతహలాడింప
గొప్ప వచ్చు నటంచుఁ గోరుచుండు
రొప్పైనఁ దప్పైన నూహింపఁగాఁ బోక
మఱియొక్కమా రన్న మాన్యతయని
సభలోనఁ దన నెంతొ స్వామివా రనవలె
నంచు మాటలు గుఱిపించుచుండు
తే. గీ. రిట్టివాడఁగులు కలరుగా యెందఱేని
నాత్మవినుతియుఁ బరనింద లధికముగను
జేసికొంటయె తమగొప్ప; చే టెఱుఁగరె ?, రమ్య...

సీ. ఒడలెల్ల నలిపిసయూరకుంగలి కైనఁ
బంచెగుడ్డ నిడుపాపానఁ బోను
ఏఁటికేఁడాది మాబోటికిఁ జదు వన్న
మాష్టరునకె లేదు మల్లుపంచె
ఎల్లప్పు డింటిలోఁ బిల్ల నాడించెను
దానికే నియ్య నేఁ గానికూడ
నింట వంటలుచేసి పెంటప్రోఁ గెత్తెడి
గుంటకే లేదు పేరంట మెపుడు

తే. గీ. చేయమన్నట్టిపని చేసి చాయవలెనె
కూడ నుండినచో సేలు జోడుగాని
కవి కిడెడి దేమి ? యిఁక మంటిగడ్డ యాంధ్రు, రమ్య...

సీ. పండితుం డయ్యును బండబూతులు వ్రాయ
వ్యావహారిక మని వాదుచుంద్రు
కర్మిష్ఠుఁ డయ్యు భోగపరాయణుం డైన
సచ్చరిత్రుం డంచు మెచ్చుచుంద్రు
బ్రహ్మజ్ఞుఁ డయ్యు దుర్ణయముఁ గావింప శి
ష్టాచార మని కొనియాడుచుంద్రు
స్వాతంత్ర్య మని వనితాతతి సివమాడ
మంచిరీతిగఁ బ్రశంసించుచుంద్రు

తే. గీ. ఎపుడు నేయొండ కాగొడు గెత్తియున్న
సమయవేది యితం డంచు సన్నుతింత్రు
ఏది సత్యమొ యది లోక మెంచ దకట ! రమ్య...55

సీ. నారాయణా! యని నోరూర నినుఁ బిల్వ
నేరనిపుట్టుక సార మేమి?
మాధవా! నీపదారాధన సేయని
పాణిద్వయం బున్న ఫల మదేమి?
గోవింద! నీకథల్ కోర్కెతో విననట్టి
శ్రుతియుగళం బున్న సుఖ మదేమి?
శ్రీధరా! యని నిన్నుఁ జేరి జోహార్లు కా
వించని యీమేను బెంచ నేమి?

తే. గీ. పుండరీకాక్ష! యని నీదుపూజ సుంత
చేయఁజాలని జన్మముల్ చేటుకొఱకె
మానవత్వంపుఫలితమ్ము మాకిఁ కేది?, రమ్య... 56

సీ. కౌసల్య, "నాపాప! కన్నతండ్రీ!" యని
ముద్దాడఁ జేసినపున్నె మేమొ?
"రామచంద్రా!" యని రాగాలు పాడుచుఁ
బొగడు నారదుపూర్వపుణ్య మేమొ?
"గురుఁడ" నం చవనిజావరున కుపొంగు వ
సిష్ఠుని పూర్వసంచిత మదేమొ?
తనవెంట రాముండు చనఁగ సంతోషించు
గాధినందనుని భాగ్యం బదేమొ?

తే. గీ. "తనయ! శ్రీరామభద్ర!" యం చొనరఁ బిలుచు
దశరథునిపూర్వకృత మగుతప మదేమొ?
తెలియ నావంటియల్పున కలవి యగునె?, రమ్య...

సీ. చక్రి సర్వగతుండు శరణాగతుఁడే యన్న
ప్రహ్లాదుఁ డెటువంటిప్రముఖుఁ డయ్యె?
రక్షకుఁ డొకఁ డున్న రక్షింపఁడా యన్న
గజరాజు మృతజీవగణనఁ బడఁడె?
భక్తుఁడై నినుఁగూర్చి రక్తితో జపియించు
నంబరీషుం డెంతయధికుఁ డయ్యె?
నేకాదశీసువ్రతైకధురీణుండు
రుక్మాంగదుం డెంతరూఢి కెక్కె?

తే. గీ. భక్తపరత, యాస్తిక్యము, పరమనిష్ఠ,
వ్రతము గల్గినసుజనులపాలిటికిని
నీవు ముంగొంగుపసఁడివి గావె? దేవ!, రమ్య... 58

సీ. ఆఁకలి కన్నమ్ము నమృతంబె యనుకొంటి
మృష్టాన్నములు నీవు మెసవుచుండ
మంచిచాఁపను బట్టెమంచంబె యనుకొంటిఁ
దూఁగుటుయ్యాల నీ వూఁగుచుండఁ
దాటియాకులపంచఁ దగుసౌధ మనుకొంటి
గుళ్లు గోపురము లంగళ్లు నీవి
కాలినడయె నేను గజ మెక్కు టనుకొంటి
రథముపై విహరించు రాజ వీవు

తే. గీ. ఎంత కంతయె నీసుఖం బెంతుకాని
నాదు మొఱ నాలకించి నన్నాదుకొనవు
స్వార్థపరుఁడవె నీవు గూఢార్థ మెఱుఁగ, రమ్య... 59

సీ. నీకంటె నా కెవ్వ రేకడఁ గల రయ్య ?
యాశ్రితవత్సలు లైననారు;
ఎలుఁగెత్తి మొఱవెట్ట నలజడి తప్పించు
వారు నా కెవరు కన్నారఁ జూచి ?
యాత్మసౌఖ్యము నాకు నమరింప నెవ రయ్య ?
నిన్ను వినాఁగ నాపన్నుఁ డనుచు;
నేమిచేసిన సరే ప్రేమపాత్రుఁడ నన
జాలి యెవ్వరికి నీ వేలకున్న ?
తే. గీ. నేమిసేతువో ? మతిమాలి యింపటంచుఁ
గొంపలోఁబడి నినుఁజూడఁ దెంపులేక
తూలితిని, నిప్పుడా నన్ను దోషి యనుట ?, రమ్య... 60

సీ. అలివేలుమంగతో నావెంకటేశుండు
తిరుపతికొండపై స్థిరుఁడు కాఁడె ?
దక్షయజ్ఞధ్వంసదక్షుఁడు వీరభ
ద్రయ్య పట్టిసపర్వతమున నిలఁడె ?
సత్యనిర్వాహణుఁ డౌ సత్యనారాయణుఁ
డన్నవరాద్రిపై నానుకొనఁడె ?
పసిఁడికన్నులవానిఁ బడఁగూల్చి యప్పన్న
సింహాద్రియందు వసింపఁబోడె ?
తే. గీ. సాటివారలు భూధరస్థాను లగుట
నీవు నిట నుంటివా రాజశీవి విడిచి
యెచటనుండిన నీప్రభ కేమిలోటు ?, రమ్య... 61

సీ. కమల నిన్నే ప్రొద్దుఁ గామించి నీపాద
సేవ జేయఁగ నేను జేయు టెపుడు?
ప్రద్యుమ్నముఖకుమారశ్రేణి నీకువా
త్సల్య మొందఁగ నాకు సమయ మెపుడు?
పడకయై విడక శేషుఁడై యూడిగము సేయ
నా కెప్పు డీకఁ దరుణము లభించు?
సురసంఘమెల్ల నీ శుశ్రూష సేయ నా
కవకాశ మేది నీయండ నుండ?
తే. గీ. గంగ నీకాలిలోఁ బుట్టఁ, గమల మెపుడు
బొడ్డుపువయి వికసిల్లి పొలుపుమీఱ,
నర్ఘ్యపాద్యము లేమి యీయఁగఁగలను, రమ్య... 62
సీ. శబరి యెంగిలిపండ్లు చవిఁజూపునంతలో
నిహపరసౌఖ్యము లిచ్చినావు
పగవానితమ్ముఁ డిమ్ముగ నిన్నుఁ గొల్వ లం
కకు వేడ్కఁ బట్టముఁ గట్టినావు
సుగ్రీవుఁ డానాఁడు చుట్టమై చూడఁ బ్రే
మించి కిష్కింధ నేలించినావు
అనుమఁడు నిను నమ్మినంతమాత్రనె భవి
ష్యద్బ్రహ్మపద మీయఁజాలినావు
తే. గీ. ఏమి కావలెనన్న నీ కేమిలోటు?
చేతిలో నున్న దేమైనఁ జేయఁగలవు
నాకుఁ జేయనె నీకుఁ బరాకుకాని రమ్య... 63

సీ. అనుకొన్న పని యెప్పు డప్పటికప్పుడే
కాదు నీసుతునిసంకల్ప మేమొ?
సిరులకై కష్టించితిరుగ మాయింటికి
రాదు నీసతి కేమి రాజసమ్మొ?
నను వీడు మని వేడుకొనఁ బోఁడు నేఁ జేయు
నపకార మేమొ నీయాత్మజునకుఁ?
కలుషములఁ బాయ గంగాస్రవంతిని మున్గఁ
బ్రోవదే నీసూఁతుభావ మేమొ?
తే. గీ. కాని పైవారి నిందింపఁబోను నీదు
కోడలే మంచి దయ్యె నాకోర్కెఁ దీర్ప
నిన్ను వరునిగఁ జేసె నాకన్నకృతికి, రమ్య... 64

సీ. నీధ్యానమును జేయ నిలువక చలియించు
మనసు వాల్గంటులఁ గనుచునుండు
నీపూజ చేయఁగ నిరసించుచేదోయి
యతివచందోయిపై నత్తమిల్లు
నీనామముఁ దలంపఁ బూననినాబుద్ధి
పడఁతిపేరు దలంపఁ బరువులెత్తు
నీకథారసము పైనిలుపనినాలుక
ముగుదకెమ్మోవికై మొగము వాచు
తే. గీ. నేమొ నాపూర్వకృతపాప మెంచలేను
జేసినవి తప్పు లెన్నియో చెప్పలేను
గాతువో కావవో నన్ను ఘాతుకుఁ డని, రమ్య... 65

సీ. ఎవనిని యాచింప నే మిచ్చి పంపును ?
బొట్ట కాప్రాఁటకుఁ బెట్టలేఁడె ?
ఎవనికి నాబాధ లిటు లంచు మొఱపెట్టఁ
దల నూఁపఁడే ? లోకధర్మ మనును
ఎవని సన్నుతిచేయు నేమిలాభము గల్గు
పరిపాటి తప్పదే పండితులకు ?
ఎవనితో నాస్థితి నెఱుకచేసినఁగాని
మనసిచ్చి మాట్లాడు మనికి లేదె ?
తే. గీ. ఏల నీ వుండ నన్యులఁ బ్రాఁకుమాలి
పోయి వేసారి కాలముఁ బుచ్చుకొంటి ?
నందఱిని జూడవే జగద్బంధుఁడవయి రమ్య... 66

సీ. పుట్టుకలో నెంతొ పోర్వెట్ట లాలించి
పెంచిన దెవరు ప్రేమించి నన్ను ?
శిశువు నై యాఁకలిచే నేడ్వఁ బాలిచ్చి
పెంచిన దెవరు ప్రేమించి నన్ను ?
వటుగు నై యడిగిన బటుఁ గయ్యో నని పెట్టి
పెంచిన దెవరు ప్రేమించి నన్నుఁ ?
పెద్ద నై యుండ నాపెంపుఁ గోరుచుఁ జూచి
పెంచిన దెవరు ప్రేమించి నన్నుఁ ?
తే. గీ. జనువుసాములు చెప్పించి కుమరుఁ గోరి
పేరుఁ, బ్రతిభయు రాఁ జూచి పెంచు టెవ్వ ?
రన్నిటికి నీవె; తలిదండ్రు లన్న నెవరు ?, రమ్య... 67

సీ. ఏతీరుగా నన్నుఁ బ్రీతిఁ గాపాడుచుఁ
జేతోముదంబును జేయఁగలవొ
సంసారమూ పెద్దసాగరంబుగఁ దోఁచు
హింసాకరం బయ్యె నింతవఱకు
గతి లేదు బ్రతుక సమ్మతి లేదు నీచుల
సేవ చేయఁగ నాకుఁ జిత్తమందు
ధనధాన్యుఁ డయ్యును దాతయే కనుఁగాని
కలవార లీను రేఁగానికూడ
తే. గీ. నెట్లు జీవింప నిఁక మీఁద నెవరుదిక్కు ?
బ్రతికినన్నాళ్లు భిక్షయే గతులు కాఁగ
ముందుపుట్టువుఫల మేమి పొందఁగలము?, రమ్య... 68

సీ. భోగభాగ్యము లేమి పొసఁగింపకుండిన
నారోగ్యభాగ్యము నైన నిమ్ము
సంసారసుఖములు సాగింపకుండిన
నిందువేడుకతోడ నుండనిమ్ము
సచ్చిదానందంబు సమకూర్పకుండినఁ
దాపత్రయం బైనఁ దగ్గనిమ్ము
పుత్రపౌత్రబలమ్ముఁ బూర్తిసేయకయున్నఁ
గృతిసంతతిని గనఁ గతుల నిమ్ము
తే. గీ. ఏమిపాపమొ యెటుఁజూడ నెవరు లేక
బాధపడుచుండు నావంటిపామరునకు
దివ్యమగు నీపదమ్ములే దిక్కు తండ్రి !, రమ్య... 69

సీ. అధికారిఁ జేతు నిరక్షరకుక్షిని
బండితు మూలఁ గూర్చుండఁజేతు
లోభివానికి లక్షలుం గోటు లిత్తువు
దాతను ఋణముతోఁ బాతివైతు
కడుమంచివానికిఁ జెడుగురాలినిఁ గూర్తు
మంచిదానికి దుష్టు మగనిఁజేతు
కూటిపేదను దెచ్చి కోటీశ్వరునిఁ జేతు
కోటీశ్వరుని భిక్షుకుని నొనర్తు
తే. గీ. వేమితలఁచిన నీచేత నేమికాదు?
నటకుఁడవు నీవె యీజగన్నాటకమున;
నార్చినను దీర్చినను నీవె యార్తరక్ష!, రమ్య... 70

సీ. తాటక నలనాఁడు తనువుమాపితి వన్న
నాఁడుదానిని జంప నధికమేమి?
వాలి నొక్కమ్మునఁ గూలనేసితి వన్నఁ
గోఁతిఁ జంపఁగ నెంతఖ్యాతి వచ్చె?
మాయలేడిని రూపుమాపితి నంటివా?
ఇట్టి నేయుట యెంతవెట్టితనము
ఆరావణుని జంప శూరుఁడ నందువా?
పదుగురు కలిసినపని యదెంత
తే. గీ. ఎఱిఁగినటువంటివా రున్నయెడలఁ జెప్పు
నీప్రతాపమ్ము మహిమయు నీటుగోటు
లేమిలాభము నాపట్ల నెడ్డవాఁడ. రమ్య... 71

సీ. సాంతంబుగా శాస్త్రసమితి శోధించిన
సమకూరునే? నీకు సత్త్వగుణము
పంచీకరణ మెల్ల బాగుగా నేర్చిన
గ్రాహ్యమే? నీతత్త్వగౌరవంబు
మన్ముద్రలను బట్టి సాధించియుండిన
దొరకునే? నీదగు పరమపదము
కఠినోపవాసముల్ గావించియుండిన
నొదవునే? నీకు సాయుజ్యపదవి
తే. గీ. కర్మకాండంబునకు నెంత కట్టువడిన
నమృతమయ మగు నీమూర్తి నరయ దరమె?
చిత్తసంశుద్ధి గలభక్తిచేతఁ గాక, రమ్య... 72

సీ. ఏకోర్కె యని నీకు నెఱిఁగి చెల్లించుదు
నేమంత్రతంత్రమ్ము లిష్టమందు
నేపూవు పండని యెఱిఁగి యర్పించుదు
నేరీతి హితమని యేమిసేతు
నేది నీ స్తవమని యెఱిఁగి నేఁ జేయుదు
నేదారి నీ దని యేగ్వరింతు
నెందు నున్నావని యెఱిఁగి పూజించుదు
నేరూప మని నిర్ణయించుకొందు
తే. గీ. నేమొ? నీనిజ మెఱుఁగ నా దెంతబుద్ధి?
యేమి సేయుదు? సామర్థ్య మేది నాకు?
నెట్లుమన్నింతువో కృతి నిచ్చుచుంటి, రమ్య... 73

సీ. ఆవేశమా నన్ను నల్లలనాడింపఁ
బాపపుణ్యము లెంచ నోఁపనైతి
దారిద్ర్యమా నన్నుఁ దహతహలాడింపఁ
జేసితి నెన్నియో చెడ్డపనులు
కామాంధకారమా కనుఁగప్పి నన్నుఁ ద్రిప్పఁ
బరకాంత కౌఁగిటఁ బట్టువడితి
ధనకాంక్షయా వెన్నుఁ దన్ని త్రోయుచునుండఁ
గలిమి సంపాదింప నలుఁగుచుంటి
తే. గీ. నేను చేసినఁ జేసితి నెలుకమాలి
ప్రాలుమాలితి నని నన్ను జాలిదలఁచి
యేలుకొను భారమా నీదె; యెవరు దిక్కు?, రమ్య...

సీ. కవనమ్ముఁ జెప్పి నీకరుణఁ బొందుదు నన్నుఁ
బోతన్ననా? మేను బొంగఁజేయ;
సకలంక మగుభక్తి నలరించుటకు నేఁ గ
బీరునా? నిన్నుఁ గన్నారఁ జూడ;
సంగీతమున నిన్ను సంతసింపఁగఁ జేయఁ
ద్యాగయ్యనా? నీమరాగ మొప్పు;
గుళ్లు, మంటపములు, గోపురాల్ గట్టింప
గోపన్ననా? యట్టి ప్రాపు లేవి?
తే. గీ. ఆస్తికిని మాస్తి యున్న దీహస్తయుగమె;
యదియె నీకు సమర్పణ మనుదినంబుఁ;
బైని గొసరుగ నామనఃపద్మ మిదుదు; రమ్య... 74

సీ. వీనులవిం దైన నీనుతి వినుచెవుల్
చెవులుగా కితరులచెవులు చవులు
చిత్రమౌ నీసుచారిత్రముల్ పఠియించు
వాయిగా కితరులవాయి గోయి
పూజ్యమౌ నీపాదపూజ చేయుకరంబు
కరముగా కితర మౌ కరము నరము
కరుణ కిమ్మైన నీవరమూర్తిఁ గనుకండ్లు
కండ్లుగా కితరులకండ్లు గండ్లు
తే. గీ. కాన నిరతంబు నీపదధ్యాన మూని
ముదము వైవాఱ సేవింతు హృదయమందుఁ
బ్రోవవే నాకు నీకన్న దేవుఁ డెవఁడు?, రమ్య... 76

సీ. ఏడుకొండలవాని వేడఁ బ్రసాద మౌ
పేరుతోఁ బెట్టఁడే యోరె యింత?
శ్రీజగన్నాథేశుఁ జేరినఁ బొంగలి
పెట్టింపఁడే యింత పొట్టనిండ?
సింహాద్రియప్పన చెంత కేఁగినఁ దిని
పింపఁడే పులిహోరఁ బ్రీతితోడ?
వరదరాజస్వామివారిని దర్శింప
నిష్టాన్న మిడఁడె సంతుష్టి దీఱఁ?
తే. గీ. బొట్టకూటికిఁ గాదు నీ కొట్టుకొంట
నీపదధ్యానమున భక్తి నిలుపుభిక్షఁ
బెట్టఁగల్గిన నదె పదివేలు మాకు, రమ్య... 77

సీ. ఎఱుఁగనివాఁడవా ? జరుగుఁబాటు లేక
యడిగితిఁగాని నాయాసకొలఁదిఁ
దెలియనివాఁడవా ? కలతెఱం గంతయుఁ
జెప్పితిఁగాని నాతిప్ప లన్ని
నేరనివాఁడవా ? దూర మాలోచింప
నాఁగలే కున్నది యంటిఁగాని
చూడనివాఁడవా ? సుఖపథమార్గము
మొఱపెట్టితినిగాని కొఱఁత లెల్ల
తే. గీ. నెపుడు నీ వుంటి వని నాదుహృదయమందు
దొడ్డనమ్మక మున్నను దూలిపోయి
త్రాగుఁబోతుగఁ జెలరేఁగి వాగుచుందు, రమ్య... 78

సీ. పుట్టియుం బుట్టక మున్నె నీకథ విన్న
ప్రహ్లాదుఁ డెన్నెన్నొ పాట్లుపడియెఁ
దనదుసర్వస్వ మీ వనుకొన్న యలకుచే
లునకు నిర్ధనత తప్పనిది యయ్యెఁ
గృతికన్యకను సమర్పించినపోతన్న
హాలము దున్నియె పొట్టఁ బోసికొనియెఁ
గొండపై నీ కిల్లు కోరి కట్టినరాము
దాసుకుఁ జెఱసాల వాస మయ్యె
తే. గీ. ముందు నినుఁ గొల్చువారికి నెందుఁ జూడఁ
గష్టములె కాని సుఖములు కానరావు;
అటులె నాపట్ల నైన నే నాఁగఁగలనె ?, రమ్య...79

సీ. పరమేశ్వరా! నన్నుఁ బాలించు టెప్పుడు?
నీదయారసము నందించు టెపుడు?
నారాయణా! నన్ను నమ్ము టెఁ కెప్పుడు?
నీ దివ్యఫలము రుచించు టెపుడు?
భువనమోహన! నీకుపూజ మా కెప్పుడు?
తనువు శాశ్వతముగాఁ దనరు టెపుడు?
కేశవా! నిన్ను నేఁ గీర్తించు టెప్పుడు?
మెప్పించుశక్తితో మెలఁగు టెపుడు?
తే. గీ. ఉన్నకాలము నిద్రచే నున్న సగము;
రోగ మని రోష్టు లని ప్రతిరోజు బాధ
పెట్ట నిహ మేది? పర మేది? తుట్టతుదకు; రమ్య...

సీ. పురుషార్థమా? యేమి పుణ్యమా? యాతనిఁ
బోషింప నని నీవు పొందినావ?
విజయమా? యిటువంటి వెఱ్ఱిమానవుఁ గరు
ణించ నా? కనుచు యోచించినావ?
వంశమా? వర్ణమా? వాసవ్రాడా? యేమి
మన కేలరా? యని మఱచినావ?
యేపాటి కలవా? డిఁ కెందుకో జమవాఁడు?
పోని మ్మటంచును బూనుకొనవ?
తే. గీ. యేమొ నీయూహ తెలియదే యెదుటఁబడిన
నేమి కోరఁగవలయునో యెఱుఁగకుంటిఁ
జాలుఁ గనిపెట్టి ప్రోచెడిశక్తి లేదె?, రమ్య... 81

సీ. మీనమై సోముని జా నడంచినదిట్ట
మెట్టు పైనూనుతాఁ బేటిమేటి
పసిఁడికన్నులవానిఁ బడఁగొట్టుక్రోడము
నరసింహుఁ డై బాలు నరయుప్రోడ
బలికిఁ బాతాళము నెలవుఁ జేసినగుజ్జు
జనపాలురను గొట్టుజన్నిగట్టు
రావణుఁ బరిమార్చు రఘురామచంద్రుఁడు
హాలముఁ, దాటిసిడంబుఁగలుగుబలుఁడు
తే. గీ. బుద్ధదేవుండు, కల్కిప్రబుఘుఁ డాది
మూర్తు లన్నియు నీవె నీకీర్తి వినమె
దశరథాత్మజరామ ! కోదండరామ !, రమ్య... 82

సీ. నారీకుచారూఢపారీణధోరణి
చేరువునకు నన్నుఁ జేర్చినావు
కామినినిడువాలుకడగంటిచూపులఁ
బిచ్చివాఁ డన భ్రమపెట్టినావు
రమణీయరమణీవిలాసమ్ముల నపూర్వ
వర్తనమ్ములకుఁ బాల్పఱచినావు
సుదతికెమ్మోవికింశుకపునిగారింపు
చే దృష్టిచపలతఁ జేసినావు
తే. గీ. ఎంతమఱలింప నెంచిన నించుకంత
మఱవ నీయక నాబుద్ధి మఱుఁగుపఱచి
తెంతటిదయార్ద్రహృదయుఁడ వీవొ భళిర !, రమ్య...

సీ. సీతామహాదేవి చేర వద్దనియెనో
లక్ష్మణుం డీతఁ డలక్ష్యుఁ డనెనో
కౌసల్య ననుఁ జూడఁ గలహించునో దశ
రథుఁడు చెప్పుటకుఁ బరాకుపడెనో
భరతుఁడు నా సేమ మరయ వద్దనియెనో
శత్రుఘ్నుఁ డీవంకఁ జనఁగ నీఁడో
సుగ్రీవుఁడే నన్నుఁ జూడ వద్దనియెనో
ఆంజనేయుశిఫారు సందలేదో

తే. గీ. అలవిభీషణుఁ డెనియుఁ బలుకఁబోఁడో
ననుగుఱించి పైవారల మనవు లేల ?
స్వయముగా నీవె రక్షింపఁ జాలవొకో ?, రమ్య...

సీ. ధనకాంక్ష ననుఁ జేరి తలఁబట్టి లాగిన
నీచులయొద్దఁ జేఁ జాఁచఁబోను
పొట్టపోషణకు నేపట్టు లేకున్నను
కూటసాక్ష్యములకై పాటుపడను
గోటుగా శృంగారపాటవ మాశించి
నాటకా లాడంగఁ బాటిసేయఁ
గోటీశ్వరులతోడఁ గూర్మి చేకూరినఁ
గులవృత్తిఁ దొలఁగ మేకొనఁగఁబోను

తే. గీ. ఆస్తికుఁడ నౌచు ధర్మరహస్య మెఱిఁగి
కటకటా కాటకమొ పడి కాల మెట్లొ
గడపుచున్నను దయరాదు; కర్మ మేమొ ?, రమ్య...

సీ. మొసలితో యుద్ధమా? తననాలుపడుటకు
నాపని యెంత నీప్రాపు చాలు
యాచన సేయుటా? గోఁచిబాపఁడ వయి
నాపని యెంత నీప్రాపు చాలు
మోసముఁ జేయుటా? మోహినమూర్తివై
నాపని యెంత నీప్రాపు చాలు
రక్కసితోఁ బోర? చిక్కులుపడుటకు
నాపని యెంత నీప్రాపు చాలు
తే. గీ. నంటి నేమంటి; విడిచేయు నర్హమంటిఁ,
మదకు నీవుంటి నేనుంటి దొడ్డ దపుడు
చేయవచ్చును దక్షత చేతి కిచ్చి. రమ్య... 86

సీ. చెఱకుపిప్పికిఁ జీమఁ జేర్చె నెవ్వఁడు?
నాభిలోఁ బురువుల నాఁటె నెవఁడు?
వృక్షాగ్రమునఁ జేర్చెఁ బక్షుల నెవ్వఁడు?
నదిఁ బొంగఁ జేసెడినాథుఁ డెవఁడు?
రాతిలోఁ గప్పను రక్షించు నెవ్వఁడు?
ఎల్లపూలకుఁ దావిఁ జల్లె నెవఁడు?
కడలిలో లవణంబుఁ గలుపువాఁ డెవ్వఁడు?
తివిరి ముండ్లకు వాడి దిద్దు నెవఁడు?
తే. గీ. సహజ మగుశక్తిఁ బ్రకృతిలో సంతరించి
యాదుకొన వాక్కు? మొక్కుకుఁ బాదువోతె
అట్టినీకు నమస్కార మయ్య! తండ్రి!, రమ్య... 87

సీ. ఎవని యానతిచేత నీరేడు జగములు
 పుట్టుచుఁ బెరుఁగుచుఁ గిట్టుచుండు
నెవని యానతిచేత నీసూర్యచంద్రులు
 హర్నిశంబులు చేయ నస్హాలెరె
యెవని యానతిచేత నీగ్రహమ్ములు మింట
 నలువొందు నక్షత్రనామ మొ
యెవని యానతిచేత నీసదాగతి యెల్ల
 జీవులప్రాణమై చెలువు మీఱు
తే. గీ. నెవని యానతిచేఁ జెట్టు లివుడుఁ దొడిగి
 పూలుఁ గాయలుఁ బండ్లుఁ బెంపుగ నొసఁగు
 నట్టిపరమాత్మ నీవ నిన్ బట్టుకొంటి, రమ్య... 88

సీ. కొండంతగజమున కుంభబలం బేడ ?
 మావటీఁ డైనట్టిమనుజుఁ డేడ ?
గుండె గాబరి సేయుచుండుసాగర మేడఁ ?
 బడవ గెంటెడువానిపగ్గ మేడ ?
బ్రహ్మాండభాండంబు పన్వచీఁకటి యేడఁ ?
 గడు మిన్కుమనుదీపకళిక యేడ ?
మానవదేహంబు మాపురోగం బేడ ?
 నౌషధ మానగింజంత యేడఁ ?
తే. గీ. బురహరుం డేడ ? సురవిరిశరము లేడ ?
 హెచ్చుతగ్గులు చెప్ప నే నెంత ? నీవె
 యాదరింప రవ్వంత కొండంత గాదె ?, రమ్య... 89

సీ. భద్రాద్రి శ్రీరామభద్రుఁడవే యన్న
శ్రీరంగవాసిగాఁ జెప్పుచుంద్రు
శ్రీరంగమే నీకు స్థిరమందిరం బన్న
నాజగన్నాథ మాయతన మందు
రాజగన్నాథమే యాయతనం బన్న
సేతువునందు వసింతువందు
రా సేతువే నీనివాస మా నను కొన్న
నల యయోధ్యాపురి నిలయ మంద్రు

తే. గీ. తిరిగితిని దేశదేశాలు దిమ్మతిరఁగ
నీప్రభావమొ, నీరూపొ, నీగుణంబొ
యూర! నీ వొక్కయెడ నుంటి వనుట యెట్లు?, రమ్య...

సీ. సంసారమా చాల హింసాకరం బని
తెలిసియు మాయలోపలనె పడితి
విషయసుఖమ్ములా వెతలకోసమె యని
తెలిసియు మాయలోపలనె పడితిఁ
బుత్త్రమిత్త్రకళత్త్రపౌత్త్రు లస్థిర మని
తెలిసియు మాయలోపలనె పడితి.
ధనధాన్యములు భూమి తనవెంట రా వని
తెలిసియు మాయలోపలనె పడితి

తే. గీ. నేమొ ? యీమాయ నీలీల యేమొకాక
యెంత జాగ్రత్తపడిన నావంత జ్ఞప్తి
రాదు; పడిపోవఁ బరితాపమా దహించు, రమ్య...91

సీ. తనువు నిత్య మటంచుఁ దలపోసి కొన్నాళ్లు
సింగారముల్ సేయఁ జెల్లిపోయెఁ
గామినీభోగేచ్ఛ కలుగఁగఁ గొన్నాళ్లు
కన్నుమి న్నెఱుఁగనికాల మాయెఁ
బుత్రమిత్రకళత్రపౌత్రసంపత్తిని
గడియింపఁ గొన్నాళ్లు గడచిపోయెఁ
బేరుప్రతిష్ఠ కై పీఁకులాఁఘుటలోనె
బిరబిరఁ గొన్నాళ్లు తిరిగిపోయెఁ
తే. గీ. గాలమా పోయె; నిఁక నీకు కరుణ యెట్లొ
నిన్ను స్మరియింప నైతి నం చెన్నఁబోక
విన్నపము లాలకింపు మాపన్నశరణ !, రమ్య... 92

సీ. కరిరాజు కష్టనిష్ఠురములు మొఱపెట్టఁ
బ్రోవవే నీదగుఠీవి మెఱయఁ ?
బ్రహ్లాదుఁ డానాఁడు పడలేనిబాధలఁ
గని కటాక్షింపవే కనికరమునఁ ?
బాండవుల్ పడరానిపాటులు పడుచుండఁ
దోడునీ డయి నీవు కూడఁ జనవె ?
ద్రోణిశరాగ్నిచేఁ దహాతహ పడు నుత్త
రాగర్భశిశువు నూరార్పలేదె ?
తే. గీ. అట్టులే చూడు నన్ను నిప్పట్టునందు
కలిమిఁ జుట్టఱికములనే తలఁప కయ్యొ !
దీనులను బ్రోతు రెవ రింక ? దేవదేవ !, రమ్య... 93

సీ. ఎచట నీనామమే యెక్కువ వినిపించు
నెందుఁ జూచిన నీదుమందిరములె
ఎచట నీచరితమే ప్రచురమ్ముగాఁ దోఁచు
నెందు నీలీలకు సందులేదు
ఎచట నీగోష్ఠియే యింపు లొల్కుచునుండు
నెందు నీసృష్టికి నెడములేదు
ఎచట నీప్రసిద్ధకు హెచ్చుతగ్గులు లేవు
ఎందు నిన్ బోలువా రెవరుకలరు ?
తే. గీ. ఎచట నీరాజ్యగౌరవ మెంచఁగలము ?
ఇంతకును బూర్వకృత మగుసంచితమునఁ
దెలియకే వారు వీరని కలఁతపడితి, రమ్య... 94

సీ. రక్షింప శిక్షింప దక్షుండ వీ వౌటఁ
జెప్పఁగా నేల? నీచిత్త మింక
విలసింపఁ గల్పింప విజ్ఞాని వీ వౌటఁ
జెప్పఁగా నేల? నీచిత్త మింక
పాలింప లాలింప నధికారి వీ వౌటఁ
జెప్పఁగా నేల? నీచిత్త మింకఁ
బాలింపఁ దూలింపఁ బ్రభుఁడవు నీ వౌటఁ
జెప్పఁగా నేల ? నీచిత్త మింకఁ
తే. గీ. నామమాత్రమ్ము నాప్రయత్నమ్ముకాని
కార్యకారణఫలితసంఘటన నీదె
మనుజచాపల్యమును నేను మానఁగలనె ?, రమ్య...

సీ ఏజీవకోటికి నేలిక వనుకొందు
నేమూర్తి నీ దని యెంచుకొందు
నెపుడు నీ యౌదార్య మెఱుఁగుదు ననుకొందు
నెపుడు నమ్మఁగలాఁడ నిచ్చయందు
నెవరు నీ యానవా లెఱిఁగింతు రనుకొందు
నెవరికిఁ జిక్కనా వీవు ముందు
నేమహాత్ముఁడు నీకు హితుఁ డని యనుకొందు
నెవ్వానివలన ని న్నెఱిఁగికొందు
తే. గీ. నేదియో మాయగాఁ దోఁచె నెంతవఱకు
యోచనము చేసి కష్టించి యోర్చియుండఁ
బున్యకాలము రవ్వంత పోవుచుండె; రమ్య... 96

సీ. ఘూపదీపములచే దీపించు నీగుడి
కలహంబు నీమేన వలపు లీను
శృంగారకళలతోఁ జెలఁగు నీపడకిల్లు
సొంపుగుల్కెడు పవ్వళింపుఁబాన్పు
ఇంగిలీకపు వింతరంగు మకుటంబు
పరమాన్నములు నీకుఁ బారణములు
రత్నాలు, పతకహారములు, కిరీటంబు,
పచ్చలకడియాలు, పైఁడిగొడుగు
తే. గీ. నన్నియును గల్గి నా కొకటైన నిడవె?
పేరుఁ దలఁదాల్చినను నీకుఁ బ్రేమ లేదె?
పేరు సార్థక మగుసదాచార మేది?, రమ్య... 97

సీ. గోవిందుఁ డని నిన్నుఁ గోవికు లందు రే?
నాకష్ట మెఱుఁగనినాఁడు నిన్ను;
సర్వేశ్వరుం డన్నసత్కీర్తి యుండు నే?
నన్ను రక్షింపనినాఁడు నీకు;
సర్వజ్ఞుఁ డీ వన్న సన్నుతి యుండు నే?
నామొఱాలింపనినాఁడు నీకు;
నార్తరక్షకుఁ డన్నయధికార ముండు నే?
న న్నుద్ధరింపనినాఁడు నీకు;
తే. గీ. నెంచ గోవిందుఁడవొ పరమేశ్వరుఁడవొ
జ్ఞానివో రక్షకుండవొ నే నెఱుంగ;
నీపరీక్షకు నే నెట్టు లోపఁగలను?, రమ్య... 98

సీ. నీపాదసేవ మనీషినై సర్వదా
పాయనివీరాంజనేయుఁ డెఱుఁగు
సంకల్పమాత్ర నీ సత్స్వరూపస్ఫూర్తి
ముదముతోఁ జూచునారదుఁ డెఱుంగు
భవదీయమహిమ గర్భస్థుఁడై కథలుగా
నాలించినట్టిప్రహ్లాదుఁ డెఱుఁగుఁ
బ్రకృతియం దెల్ల నీప్రభ నిండె ననునట్టి
శ్రుతిరహస్యమును శ్రీశుకుఁ డెఱుంగు
తే. గీ. నీకు నామమహత్త్వంపునియతి యెల్లఁ
గోకిలం బయి కూయువాల్మీకి యెఱుఁగుఁ
గాని నిన్నన మే మెంత కలియుగాన?, రమ్య... 99

సీ. పాపమంచును బరితాప మొందుదుఁగాని
చేయుచున్నా నెన్నో చెడ్డపనులు
కడుపుకక్కుఱితిగాఁ గడ కెఱుంగుదుఁగాని
తడఁబడుచుంటి దుండుడుకుపనుల
మంచి గా దనుచు యోచించుచుందునుగాని
విడువదే? మన సీను చెడుగులందు
సజ్ఞాన మని బుద్ధి నాడుచుందునుగాని
యావేశమునుబట్టి యాఁపలేనె
తే. గీ. ఏమిపాపమొ, నాజన్మ కేమికొఱఁయొ?
చేసి పరితాప మందుటఁ జేయుచుంట
మానదే నీకుభక్తిని బూను చెపుడు?, రమ్య... 100

సీ. ప్రియుని కైవడి నన్నుఁ బ్రేమలో ముంతువు
శతునిరీతిగ నాకు శ్రమల నిడుదు
తల్లిలాగున నన్ను నెల్లెడఁ జూతువు
కలచందమునఁ దోఁచి కనులఁబడవు
గురునిమాదిరి నాకు మఱుఁగుఁ జెప్పుచునుందు
పాపకూపమునందుఁ బాఱవైతు
తండ్రిపోలిక నన్ను దయ నేలఁ గనిపింతు
వాపత్తు పైఁబడ నడ్డుపడవు
తే. గీ. ఏమొ నీయూహ తోఁచ దిల్లెందుకొఱకు
మాయ నాటక మాడెద వోయి! చెపుమ
దీన నీ కగుపేరుప్రతిష్ఠ లేమి?, రమ్య... 101

సీ. హిందూముసల్మాను లందఱి నొకటిగాఁ
జేసిన దీభద్రశిఖరిగాదె?
గోపన్న సంసారతాపమ్ము లణఁగింటఁ
జేసిన దీభద్రశిఖరిగాదె?
తానీషమూర్ఖతఁ దప్పించి జ్ఞానిగాఁ
జేసిన దీభద్రశిఖరిగాదె?
మతములఁ గొట్టి సమ్మతి నందఱిని గొల్వఁ
జేసిన దీభద్రశిఖరిగాదె?
తే. గీ. యెంచ నీభద్రగిరిపూర్వసంచితమ్ము
చెప్ప శక్యమె నాబోఁటిచిఱుత కిపుడు?
వినఁ దలంచిన నీవె చెప్పింపవలయు; రమ్య... 102

సీ. ఎవఁడు నా కిచ్చు? నీకృప యింత లేకున్న
నంటి ధనప్రాప్తి యైనతఱిని
నెవఁడు నన్ గొట్టు నీ దవుప్రాప్తి లేకున్న
నంటిఁ దిరస్కార మైనతఱిని
నెవఁడు వంచించు నీ కష్టమే లేకున్న
నంటిఁ బరాభవం బైనతఱిని
నెవఁడు బిడ్డగు నీమహీసుతా దయ లేక
యంటిఁ బుత్రోత్సవ మైనతఱిని
తే. గీ నన్నిటికి నీవె యంటి నే నాదుమాట
తప్పొ యొప్పొ యెఱుఁగ నీ వొప్పితేనిఁ
జూడు నాభార మంత మా తాడకుండ; రమ్య...103

సీ. పోతనపైఁ జూపు ప్రీతిఁ జూపిననాఁడు
హాయిగాఁ గృతి నీకె యీయఁబోనె ?
భ్రమరకీటన్యాయభాతిఁ జేసిననాఁడు
కాళిదాసునివంటికవిని గానె ?
వాల్మీకి కిడినతావకమంత్ర మిడునాఁడు
వ్రాయనే కోటిరామాయణములు ?
ధర్మాత్మజున కిడ్డదయను జూపిననాఁడు
పాలింపనే లోకజాల మొకఁడ ?
తే. గీ. నాంజనేయునిపైఁ జూపు నాదరమ్ముఁ
జూపినావేని నామీఁద సుస్థిరముగఁ
బడయనే భావిసద్బ్రహ్మపదవి నేను ?, రమ్య... 104

సీ. ఆఁకలివేళ మృష్టాన్నముల్ చల్లారఁ
బెట్ట శ్వానము మూతిఁ బెట్టినపుడు
పరిపక్వమై పంటపై రుండఁగాఁ బెను
గాలిచే సస్యము తూలినపుడు
తనువరించిన కాంతఁ గొనిపోయి తలిదండ్రు
లితరులకుఁ బెండ్లి కిచ్చినపుడు
వైభవోపేతపట్టాభిషేకంబు కాం
తారవాసంబుగా మాఱినపుడు
తే. గీ. నర్థిమన మెట్టులుండునో యటులె నాకుఁ
జేతి కందెడిఫలమునుఁ జేరనీక
వ్యర్థునిగఁ జేయుచుంటి నీస్పర్థ యేమొ ?, రమ్య...

సీ. ఆంజనేయున కిచ్చునాధిక్య మిడినచో
దాఁటనే భవవార్ధి మాటలోన ?
ప్రహ్లాదునకు నిచ్చుభక్తి నా కిడినచోఁ
జూడనే ని న్నెల్లచోటులందు ?
ధ్రువున కిచ్చినమనోరూఢి నా కిడినచోఁ
గట్టనే నిన్ను నాయెట్టయెదుట ?
నారదుపైఁ జూపుకూరిమి నా కిడ్డఁ
గలసికోనే నిన్నుఁ దలపులోన ?
తే. గీ. యెంతపాక్షికమో భక్తసంతతియెడ
నిప్పటికి నీకు నామీఁద నేమొకాని
కనికరము రాదె? నాపూర్వకర్మ మొక్కొ?, రమ్య...

సీ. ఆపన్నులను వీడ నీపన్నుగడ యేల ?
యచ్చు కొక్కటి సేయ మెచ్చు రెవరు
కష్టజీవులఁ బ్రోవ నిష్టము లేకున్న
సుఖుల రక్షింపను జోద్య మేమి ?
పాపాత్ములను నెట్లు పాలింప నంకువా ?
పుణ్యులఁ జూచినఁ బొలుప దేమి ?
ఏపాటిదొరవని చేపట్ట నంటివా ?
ఘనుల కీ వరసెడిపనులు గలవె ?
తే. గీ. నీకు దక్షత కలదేని సాఁకు మయ్య !
వారు వీ రని భేదము చేరకుండ
దీనరక్షకబిరుదు శోధించు మయ్య !, రమ్య... 107

సీ. కైకవరంబుచేఁ గానల నివసింప
వచ్చినా వనఁగ నీ మెచ్చెజనము
ఖరదూషణాదిరాక్షసులఁ జక్కాడుట
నాలించి ఋషులు మి న్నందుకొనిరి
పగవానితమ్మునిఁ బాలించితి వనఁగ
సురలు వర్షించిరి విరులవాన
రావణుఁ జంపి నీలావుచే సీతను
గైకొంటి వనఁ గీర్తి కడలుప్రాఁకె
తే. గీ. నేమిలో టయ్య? గుణవంతు లెచట నున్న
గౌరవమెకాని సుఖములఁ గాంచఁబోరు;
కనుకనే కొండ లెక్కంగ మనసుపుట్టె; రమ్య... 108

సీ. తాటకఁ బరిమార్చుపోటరి వైయున్న
రాదు నీ కీపేరు రామభద్ర!
శివునికార్ముక మొక్క చిటికెలో విఱిచిన
రాదు నీ కీపేరు రామభద్ర!
వాలి నొక్కమ్మునఁ గూలనేసినఁగాని
రాదు నీ కీపేరు రామభద్ర!
రావణాసురుఁ జంపుచేవ గల్గినఁగాని
రాదు నీ కీపేరు రామభద్ర!
తే. గీ. సీత నీచెట్టఁబట్టుటఁ జేసికాని
యింతపే రుండునే ద్వాపరాంతమునకుఁ?
దాత, రఘువున కేది నీఖ్యాతిఁ జూడ?, రమ్య... 109

సీ. ఒకచోట నవ్వింతు వొకచోట నేడ్పింతు
వొకచోటఁ బాడింతు వొప్పమీఱ
నొకచోట మ్రొక్కింతు వొకచోట మ్రొక్కఁల
నందుకొమ్మని నన్ను ముందునుంతు
వొకచోట రాగమ్ము నొకచో విరాగమ్ముఁ
గలిగించి యాశ్చర్యకలన ముంతు
వొకచోఁ జరాకును నొకచోఁ బరాకును
దెప్పించి నాముప్పు ద్రిప్పలందు
తే. గీ. వొక్కచో నుండ నియమింతు వొక్కచోట
దేశద్రిమ్మరి యనిపించి ద్రిప్పు దార !
బొమ్మలమె నీకు మేము ? కానిమ్ము దేవ !, రమ్య...

సీ. నీధ్యానమును జేసి నిమిషంబులోపలఁ
గనుమూసి నీమూర్తిఁ గాంచుచుండ
జాగరూకతతోడ యోగమ్ముఁ బట్టఁగఁ
బట్టెరా విడఁ డని తుట్టతుదకు
శ్రవణమ్ములకు నేదొశబ్దమ్ముఁ జేకూర్చి
చెలువ మోహపుబొమ్మఁ జెంత నునిచి
కనులపండువుగాఁగఁ గనఁజేసి చిటికెలోఁ
జిత్తమ్ము నిటునటుఁ జెదరఁగొట్టి
తే. గీ. మట్టిచప్పుడులో నీవు మాయ మగుదు
వింతవ్యామోహ మిడినవా రెవరు నాకు ?
బంతివలె నీవెకాదె యాడింతు నన్ను; రమ్య... 111

సీ. ధర్మమార్గమ్ము నాదరముతోఁ జూపినఁ
బ్రాంత మావంకకుఁ జనఁగఁబోదు
కామోపభోగముల్ కలలవంటి వటంచుఁ
దెలిపినఁ మనసు చంచలత విడువ
దేది యేలాగున నేర్పాటు కాఁదగు
నది నాపురాకృత; మట్టికర్మ
ముఖ కనుకూల మై యొనరుదానికి మించి
యిదమిత్థ మని చేయ నెవని శక్య?
తే. గీ. మిదియె నాప్రార్థనము; నాకు నిదె మతంబు;
జన్మజన్మాంతరములందు మన్మనమున
నీపదారాధ మగుభక్తి నిలుపు మయ్య!, రమ్య... 112

సీ. గర్భనారకమును గడచి నే భువిఁ బడ
కుండ నాతండ్రికి నుసురుఁ బాపి
తరువాత మూఁడేండ్లు దాఁట నాజనయిత్రి
నెటిఁగి యెఱుఁగకుండఁ గఱవుఁజేసి
ననుఁ జూచువార లెవ్వను లేనితఱిని నా
పెదతల్లికిని జేర్చిఁ బెం పొసంగి
చదువుకో దేశాల సంచరింపఁగఁ బంపి
సంసార మని యొక్కచాసఁ గట్టి
తే. గీ. బిడ్డ లని పెట్టి చంపుచు నడ్డమైన
పొరుగుపంచల పాల్చేసి పొట్టకొఱకుఁ
ద్రిప్పుచుంటివి నీముప్పతిప్ప లనుచు; రమ్య... 113

సీ. దున్నఁబోవఁగ నెద్దు మన్నఁబోవఁగ నావు
కాకుండఁబోయితిఁ గర్జ మేమి?
తెక్క లాధార మేముక్క లేమాత్రమో
వచ్చిన డబ్బిచ్చువారు లేరు
కాలముఁబట్టి నౌకరి మంచి దని యుంటి
నూరూరఁ బొట్టకుఁ జేరలేక
పొట్ట నెప్పట్లనో పోషించుకొనవచ్చుఁ
బని వోవ నుత్సాహభంగ మయ్యె
తే. గీ. నేదొ నీపున్న మంచు నే నాడుకొన్న
పనియె పదివేలు; పయిపయిపరువు లేల?
యెవనికిని బుద్ధి పుట్టింప నీయఁబోరు; రమ్య... 114

సీ. అగ్రహారికుఁడను నగ్రహారము లేదు,
నిగ్రహించెడుబుద్ధి నిలుపలేను,
విద్యార్థినేకాని విద్వాంసుఁడనుగాను
బద్య మల్లినఁ గవీశ్వరుఁడఁగాను,
బొట్టకోసము విద్యఁ బట్టిపల్లార్పను,
ధనవంతు లనుచు వందనము లిడను,
రాజమర్యాదకై ప్రాకులాడఁగఁబోను,
నోరూర్పురుచులకై జాలిపడను,
తే. గీ. గులముపెంపును బాటించి, గుణ మెటింగి,
న్యాయమార్గము చేపట్టి నడచుచున్న
జాలిఁ జూడ; వ దేమొ? దయాలవాల!, రమ్య...115

సీ. "ఊడిమూడి" సమాఖ్య నొప్పునింటను నన్న
పూర్ణకు నాగరాట్ పుంగవునకుఁ
దనయుఁడ రామభద్రునకుఁ బౌత్రుఁడ, భా
రద్వాజగోత్రానఁ గ్రాలుచుండి
తెగ "బళ్ల" వారికిఁ దత్తుఁడ నయి వేంక
మాంబను నీలాద్రిమనుజవిభుని
వల్లియుఁ దండ్రిగా నెల్లప్పుడును గొల్చి
వారియాశీర్వాదభాగ్య మంది

తే. గీ. విమలరుక్మాంగదునిగోత్ర మెనసి నీకు
గొన్ని నూటపదా ర్లీయఁ గలిగినాఁడ
సాఁకుమీ నను గృప రామచంద్రకవిని
రమ్యగుణసాంద్ర! భద్రాద్రిరామచంద్ర! 116

శ్రీ శ్రీ శ్రీ

---

సవరణ.

| | | | |
|---|---|---|---|
| 24 | పద్యములో | తను | తన |
| 51 | " | అట్టుకును | అట్టునకు |
| 58 | " | భక్త | భక్తి |
| 62 | " | పాద్యము | పాద్యాదు |

---

శ్రీపతిముద్రణాలయము, కాకినాడ—1937.

# పండితాభిప్రాయములు.

మహారాజశ్రీ బళ్ల రామచంద్రరాజుగారు రచించిన "భద్రాద్రిరామ చంద్రశతకము" వారు చదువగా వింటిని. అందు నీతి, భక్తి మున్నగు విషయములు నిబిడీకృతములైయున్నవి. శైలి సరళముగ ద్రాక్షాపాకముగ నుండి పండిత పామర మనోరంజకమైయున్నది. ఏపద్యముచూచినను ధారాశుద్ధిగలిగి శ్రవణపేయముగానున్నది. దీని నాంధ్రలోక మాదరించుటయేగాక, పాఠశాలలలో పాఠ్యపుస్తకములుగఁ గూడ నిర్ణయించుట కనుకూలపద్ధతిఁ బొందియున్నదని నా యభిప్రాయము.

కవిసార్వభౌమ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, రాజమండ్రి.

శ్రీ బళ్ల రామచంద్రరాజుగారు, వారు విరచించిన "భద్రాద్రిరామ చంద్రశతకము"ను స్వయముగ బఠింప నాలకించితిని. సరసమగు మృదులశైలియు హృదయంగమము లగు దేశీయోక్తులును, నీతిభక్తిపరిపూరితము లైన భావములును గల యీశతకము కళాశాలలలోని విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగానుంచిన వారి నైతికజీవితమునకు మిపుల ప్రబోధమును గల్గించునని నా నిశ్చయము.

ఈ కవివరున కింతోధికముగ ననేక గ్రంథరచనాసామర్థ్యమును ప్రసాదింప హరిహరదేవు ననయము నర్థించుచున్నాఁడ.

కవికంఠీరవ, కాకరపర్తి కృష్ణశాస్త్రి, తుల్యారామేశ్వరము.

సీ. మాకవితాపితామహుల శ్రీతిరుపతి, వేంకటేశ్వరుల దీవెనల నొంది
మామకజనని శ్రీకామేశ్వరీదేవి, దయ నొందఁ దగినపాత్రత గడించి
మావంటికవిమిత్రమండలి కున్ముఖ, మగు హృదబ్జమ్ముతో నతిశయిల్లి
మాభట్టుమూర్తియశోభాగ్యమును నిజా, స్వయసీమ నిలుపుకొనంగఁ బూని

గీ. రమ్యగుణసాంద్రు భద్రాద్రిరామచంద్రు, నాశ్రయించిన నీకు నిత్యమ్ము భద్ర
మగుట కింక సందియం బేమి? యలరితిగద, సార్థకాఖ్యుఁడ వై రామ
చంద్రరాజ!

అష్టావధాని, ఉభయభాషాప్రవీణ,
వడ్డాది సీతారామాంజనేయకవి, (ఖాశింకోట.)